# కర్నాటక దేశంలో వీరుల ఆత్మార్పణం.

ప్రాణానికన్నా అమూల్యమైనదీ పవిత్రమైనదీ మరొకటి లేదన్నది సామాన్య భావన అయినా—లేక ఈ సామాన్య భావన ఉన్నందునే—తాము పరమ శ్రేష్ఠమని నమ్మిన కొన్ని భావాలకోసం తమ ప్రాణాలను నిశ్చింతగా, స్వేచ్ఛతో తమ చేతులార తామే అర్పించుకొని, ఇహలోకం నుంచి ఇతర లోకాలను పొందిన వీరుల ఉదాహరణాలు అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో ఉన్నవి. కడచిన ప్రపంచయుద్ధంలో తమ దేశహితంకోసం ప్రాణాలను తృణీకరించి ముందుకువచ్చిన "సుయిసైడల్ స్క్వాడ్స్" ఈ రకం వీరులదండు. ఇతర దేశాలలో ఇలాటి మరణం లౌకిక వీరంగా పరిగణితమయితే, మనదేశంలో ఇది ఒక పరమార్థ వీరంగా ఎన్నికయినది.

సముద్రుడు లంకకు దారి యివ్వనప్పుడు రాముడు ప్రాయోపవేశానికి ఉద్యుక్తుడయినాడు; పద్నాలుగు సంవత్సరాల తర్వాత రాముడు వనవాసంనుంచి వెనుదిరిగి రాకపోతే, తాను అగ్నిప్రవేశం చేసి ప్రాణత్యాగం చేస్తానని భరతుడు నిశ్చయించినదీ, తన తమ్ములలో ఎవరు మరణించినా, తను వానిలో అగ్నిప్రవేశం చేస్తానని ధర్మరాజు ప్రతిజ్ఞ చేయడమూ, బదుకు దుర్భరమయినప్పుడు కొండశిఖరంనుంచి పడి ప్రాణాలు పోగొట్టుకొనే భృగుపతనమూ పురాణేతిహాస కాలాల వీరుల ఆత్మార్పణకు ఉదాహరణాలు.

చరిత్ర కాలానికివస్తే, రాజపుత్రుల "జౌహర్" పద్ధతిని తెలియనివారెవరు? దక్షిణదేశపు—ముఖ్యంగా కర్నాటకాంధ్ర ప్రాంతాల—"వీరగల్లు" లను, "మాస్తిగల్లు" లనూ చూడనివారెవరు? విననివారెవరు?

తన పతిని కోల్పోయినతర్వాత ఉండలేక, అతని కళేబరంతో పాటు నిప్పులో పడికాలి బూడిదైన కుల వధువుల కథలు ఎవరికి తెలియవు? ఇలాటి మహాసతులవలెనే అనేక వీర పురుషులుకూడ అత్యంత స్వామి భక్తితో, అత్యంత దేశ ప్రేమతో అన్యాయాలను, క్రౌర్యాలను, జీవ హింసలను ఎదిరించి, న్యాయ దయా జీవకారుణ్యాలను ఉద్ధరించడం కోసం తమ ప్రాణాలను అర్పించిన అనేక తార్కాణాలున్నాయి.

దొంగలు గోవులను అపహరించడానికి వచ్చినప్పుడు, ఏనుగో పులో జనానికి ఉపద్రవం కలిగించినప్పుడు, మహిళల మానాపహారానికి ప్రయత్నం జరిగినప్పుడు, స్వామికి హాని సంభవించినప్పుడు, దేవాదాయ ధర్మాదాయాలకు ఇబ్బంది కలిగినప్పుడు, ధర్మప్రతిష్ఠాపనకు నిలబడి పోరాడి, మడిసిన వారు ఎంతోమంది. వారి స్మారకంకోసం దేశం నిలిపిన శిలలే "వీరగల్లు"లు ఆ విధంగానే మహాసతుల జ్ఞాపకార్థమయినవి "మాస్తిగల్లులు." (మహాసతికల్లు = మాస్తిగల్లు)

ప్రకృతం, ఈ శాంతల నవల కాలానికి ఇలాటి ఆత్మార్పణాలు సమాజంలో సామాన్యంగా ఆచారంలో ఉండేవి. ఈ నవలలో వచ్చే గరుడి (గరుడ), భైరవ, రణబలి, సతి, సల్లేఖన, సిద్ధతలాదులు అన్నిటికీ శాసనాల నిశ్చితాధారం ఉన్నది. ఇలాగు ప్రాణార్పణం చేసుకొన్న వీరులను, వీర వనితలనూ ఊరికే "చచ్చినారు" అనేవారు కారు. "చచ్చి సురలోకం చేరినాడు, సురలోక ప్రాప్తుడయినాడు, సతి సహానుభూతి పొంది సురలోకానికి చనినది, మహాసేనులు స్వర్గాగ్రం అధిరోహించినారు" అని వారికి సద్గతినే చెప్పేవారు. (ఈ ఉదాహరణలు కన్నడ సాహిత్యంలోవి.) పూర్వకాలపు ఈ వీరయుగంలో ఈరీతి ప్రాణార్పణం ఒక యోగమనే పరిగణిత మయినది.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GVRPOIP140 | Date | 8-3-2021 |
| Front Cover | NO | Back Cover | NO |
| Blank Pages | 2, 114, 306, 374, 376, 388, | | |
| Missing Pages | I TO II, 125 to 128 | | |
| Prepared | G. Sreelakshmi | Scanned | Shahena. |
| BOOK SIZE | H 7 W 4.9 | Pages | 403. |